శ్రీరాములు.

ఇందు

# రామభజన కీర్తనలు, కందార్థములు, తత్వములు, భజనకీర్తనలు, కృష్ణలీలలు కలవు.






---

ఇది

యెలమంచిలి ఆదెయ్యాఖ్యునిచే

రచియింపబడి

శ్రీమద్వేదాంతసారసంగ్రహాద్యసద్వృశపరిపూర్ణాచల
స్వరూపు లగు

బత్తుల లక్ష్మయ్యగారిచే

సవరింపబడి

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు

కే. బీ. కృష్ణారావుచే

ముద్రింపబడియె.

---

1916.

కలరగనిన్ను - గూర్చినుతించెద ॥భార॥ ౧ వీణాపు స్తకపాణి-నలువరాణి - వాణీనాజిహ్వాపైన -,వసియింపగ దేజననీ॥భార॥ ౨ తలవాకిటనుండు - పొలతినాపైకృప - గలిగినాకైమైనప లుకులొసంగుమా ॥భార॥ ౩ అంబాసుగుణకదంబావదనేందు - బింబామదరో - లంబాళకాలిక ॥ భార॥ ౪ ధరనులింగముగుంట - పురియందువెలసిన - గరుడవాహానుని - గాదిలికోడలా ॥భార॥ ౫

* క వి వం శా వ ళి *

సీ॥ శ్రీరమణీశపా దారవిందార్చనా గ్రగణ్యులై వెలయువారు కమ్మవారు । సతతమాశ్రితజన సమితికష్టభీముల్ గడునెసంగెడువారు కమ్మవారు । ఆకొన్నవారిని చేకొనియన్నంబు గడువడినిడువారు కమ్మవారు । రేయుబవల్లుహరిస్మరణంబుచక్కగ జేయగలవారు కమ్మవారు॥ గీ॥ అట్టికమ్మవంశంబునయందుమిగుల। పేరుగాంచిరి యెలమంచివారలందు। నబ్ధిచంద్రునిగతిబుట్టి యప్పయాఖ్యు । సుగుతరయశోవిలాసుడై యొప్పుచుండె॥

క॥ ఆయనఘుడు పూర్వము నా
రాయణుడలల క్ష్మిబెండ్లియైనటులిల ల
క్ష్మియంబుజాక్షి పరిణయ
మైయాయుమయందు ఘనులనాత్మజులదగ౯ ॥

మ॥ గనెనాదెయ్యనునాదిసుబ్బయను రాగంబొప్పశ్రీరామచంద్రునిసౌమిత్రునిబోలువారినన ఘస్తోత్రార్హచారిత్రుల౯ వనజాతాక్షినినాగర త్తమను భావంబెప్పుసంతోష మం

దునమున్గంసుఖసంపదల్ మెరయభూతుల్ మించగాం చెంద

క॥ అందాదిసుబ్బయాభిదు [౫౬

డందంబుగనాదెమాంబ నాత్మగృహిణిగా

నొందిశిరులందెనేనీ

చందంబున నెగడి విబుధసాంగత్యమునన్॥

చ॥ మెలగుచు పుణ్యమార్గముల మేలుగ ద్రిమ్మరుచున్ హితా

హితం । బులగనుచున్ పరోపకృతిపొంతలబోవుచు నన్య

చింతలన్ । దొలగిచరించుచున్ హరివినూతనసద్గుణవర్ణ

నంబుని శ్చలతరభక్తి సల్పుచును సాధుపదార్చన జేయుచుం

డితిన్॥

గీ॥ హరిన నేకవిధంబుల నాత్మదలచి

పత్రిలు జన్మమున కుసాఫల్యమనుచు

నీకృతిని జేయబూనితి నేకశాపి

దుండగానుర మేశు భక్తుండగాని॥

శ్రీ శేషశైలాగ్రనివాసదేవతాభ్యోనమః.

తత్వములు.

నాదనామక్రియరాగం—ఏకతాళము.

ఎందుకు నీవీదుర్బ్రమలనుబడి- జెందవుసుఖముల- ఓమ

నసా - మందమతివిగాకను శ్రీహరి నే - మారక దలచవె

ఓమనసా ౧ ఆశపాశములు - కోసివేసి ల - క్ష్మీశుని నమ్మవె-

ఓమనసా - గాసిజెందకను జేసునుపిమ్మట - దోసములంటవె

ఓమనసా॥ఎందు॥ ౨ బొట్టులుపిట్టలు గలవనిమురయుచు - విట్టి

వీగకవె ఓమనసా - తొట్టికొంపలో చిక్కినదానవు - బిట్టులు

మానవె - ఓమనసా॥ ఎందు॥ 3 కాయసు ప్రాయము - స్థిర
మనిమదిలో - కానక తిరుగకె ఓమనసా - హేయమనుచునీ-
కాయసుఖంబులు - రోయుము సమ్మతిగనుమనసా॥ ఎందు॥ ౪
ఎందరయిరో తలిదండ్రులు యిక ముం - దెందరు కాగలరో
మనసా - మందమతివిగాకను యిహసుఖముల - పొందువీడవే-
ఓమనసా॥ ఎందు॥ ౫ దాసదాసులకు - దాసుడననుచును -
దోసిలొగ్గవే ఓమనసా - దోసములెల్లను బాసి శ్రీహరిని -
వాసము జేరవె - ఓమనసా॥ ఎందు॥ ౬ వివిధ లింగగుంట
పురీశుని - మరుగు జేరవే ఓమనసా - కరుణమీరి యెలమంచి
ఆదెయను - మరువక బ్రోచెనె ఓమనసా॥ ఎందు॥ ౭.

శంకరాభరణరాగం—ఏకతాళం.

గురుడే దైవంబనరా - యిల- నరుడేహరియనిగనరా -
గురుడే హరియని - గురుతుగనమ్మిన - మరువక నిన్నుబ్రోచు
నుగదరా॥ గురుడే॥ ౧. యింతమదమేలనీకేల- నేనెంతనిదెల్పు
దు- చాల- యింతటనైనను రంతులుమానియు - సంతసమున
భగవంతునిగొల్వరా॥ గురుడే॥ ౨. చిన్న పెద్దలనుజూచి- బహు
మన్ననతోదగ లేచి సన్నుతులొనరించిన - సద్గతిగని - యెన్న
రానిసుఖమనుభవించెదవు॥ గురుడే॥ 3. కామమోహములజి
క్కి - కనుగానకబల్ - పొగరెక్కి - నీమము చెడి- పరకాంతల
గూడిన- నీమహిబహునరకములజెందెదవు॥ గురుడే॥ ధారుణిలిం
గముగుంట- పురధామునిగొల్చిన తంట- దీనును ఆదెయ్యాఖ్య
దాసునిక- కూరిమిబ్రోచును- నేరము లెన్నక॥ గురుడే॥ 2

నాదనామక్రియరాగం—ఝంపతాళము.

ఎన్నాళ్లుబ్రతికినను - యేమిసామ్రాజ్యంబు - విన్నావో లేదో - ఓమనసా - పన్నుగాయముని పాల్ - బడకమును పే. హారిని. సన్నుతించవె మూఢమనసా॥ ఎన్నాళ్లు॥ ఆశకును మితి లేదు - దోసమెరుగక నీవు - మోసపోకవె మూఢమనసా - నాశవిరహితచిత్తు - కానువెరనమ్మినను - గాసిజెందవు - మూఢమనసా॥ ఎన్నాళ్లు॥ పుట్టుగిట్టుచునున్న - పుడమిలోపలనీకు - యిట్టి కష్టము లేలమనసా. పుట్టుగిట్టుటలేని - గుట్టుదెల్పినగురుని - పట్టువీడకుమూఢమనసా॥ ఎన్నా॥ గురుడె పురహరుడనుచు - గురుతు దెలిసినవారి - మరుగు జేసివె మూఢమనసా - గురుడె కేవల పరాత్పరుడనుచు దెలిసియును - నెరనమ్మి నిజముగను మనసా॥ ఎన్నా॥ దాచిపెట్టిన ధనము - దాయాదులకునౌను - దానధర్మము జేయుమనసా - గోచియైనను గాని - గొనిపోవుదువె నీవు - చీచి నీకిది తగునెమనసా॥ ఎన్నా॥ తల్లిదండ్రులు మరియు నెల్ల బాంధవులును - కల్లలని దలపోయుమనసా - యిల్లువిడిచియు ప్రాణి - వెళ్లిపోయేనాడు - తలిదండ్రులెవ్వరో మనసా॥ ఎన్నా॥ ధరనులింగముగుంట పురమందు నెలకొన్న - హారినిమరువకె మూఢమనసా - అరలేక యెలమంచి - ఆదెయాఖ్యదాస - వరుని బ్రోచెను మూఢమనసా॥ ఎన్నా॥ 3

### మధ్యమావతి రాగం—ఆటతాళము.

మాయదీ యీతనువురా - భ్రమచేతగలైను - మట్టికుండనుకొనుమురా॥ మాయదీ యీతనువుమీదను - మమతలన్నియు వదలివేసియు - బాయకను సద్గురుని జేరియు - సేయరా పరిచర్యలన్నియు॥ మాయది॥ ఘనుడనేననుకొంటివి - నీలోన

యున్న - ఘనుని దెలియకుంటివి- అనయము రోగాలకొంప-
అంతు తెలియదు దుంపద్రెంప - వినయమున సద్గురుని జేరియు
కనుముముక్తిని ఘనత బెంప॥ మాయది॥ పరసతులజతగోరకు
పాపంబటంచును _ పరుల ధనమును గోరకు - యెరిగియెరుగని
తప్పులున్నను- గురుని జేరిన నురుము జేసియు- పరమపదమార్గం
బొసగి- చిర- తరసుఖామృతవృష్టిమించును॥ మాయ॥ కుల
మె ముఖ్యంబనకురా - ఋషులెల్ల రును యే - కులము వారో
చూడరా - కులముతో బనియేమి ముఖ్యము గుణముగలిగిన
జాలు - నంతటగురుని జేరిన - పరముగలుగిది - యరయకను
మోసపోకుమురా॥ మాయ॥ కండకాపరమేలరా - యిహాభో
గములలో - నుండినను మోసంబురా- కండలును మాంసమును
నెత్తురు- మెండుగను గలిగుండు దేహము- పండుటాకు విధంబు
నను భూమండలంబున రాలిపోవును॥ మాయ॥ ధరను లింగముం
గుంటను- వెలసిన శ్రీహరి- కరుణగల్గినచాలును - మరువకను
యెలమంచి ఆదెయ- నరమరేమియు లేక బ్రోచెను- స్థిరమతిని
నామురహరునిపద- సరసిజంబులు- నమ్మిగొల్వుము॥ మాయ॥

బేహాగ్ రాగం——ఆటతాళము.

రాములకు దయరాదు - సీతమ్మ నను బ్రోవుమని- బ
హు ప్రేమతో దెల్పవె మాయమ్మ - పామరుండను నేను జే
సిన - పాపములు యెడబాపు మనుచును - కాముకేళి విలా
సమున నీ - కాంతునకు కనుసంజ్ఞ జేయవె॥ రాములకు॥ దా
సులకు దాసుడను నేనమ్మ - దయతోను బ్రోచె భాసురాంగి
వి నీవె మాయమ్మ - వాసిగను యీవేళనాదు - గాసిదీర్చక

నున్న - తనకిక మోసమని నే ముందు దెల్పితి - యీసరికి నీ వైనజెప్పుము॥ రాముల॥ తల్లిదండ్రియు మీరెనాకమ్మ- మీ కన్న దైవము లెల్లలోకములందు లేరమ్మ- పల్లవాధరి నాదు మది రంజిల్ల వేడితిమిమ్ము సతతముకల్లయుగమున పుట్టజేసియు తల్లడింపగ జేయతగునటె॥ రాము॥ శరణు శరణని యన్న వారిని- చేపట్టిబ్రోచె చేతికంకణ మున్నదనుచువినిని బిరబిరను తనమరు గు జొచ్చిన వెరువ వలదనడేమి సేయుదు - కరినిగాచిన మా టనిజమని గట్టిగా నేనమ్మజాలను॥ రాము॥ యెండవానల కో ర్వలేనమ్మ - సంసారమనెడు సింధు సాగర మీదలేనమ్మ - మండుచును దండధరుడును - బహు గుండె లదరగ చెండునని నీ - యండ జేరితి బ్రోవకుండిన - మెండుగా నపకీర్తి గల్గు ను॥ రాము॥ యిలనులింగముగుంట పురమందు - వెలసినహరి కి కులసతీమణివంచు - మనమందు తెలిసియును - యెలమంచి ఆదెయ - పలుగతుల నిను వేడె గావున- నలుకు లేకను బ్రో వుతల్లి - నార్యజనకల్పకవల్లి॥ రాములకు॥ 5

నాదనామక్రియ రాగం—జుల్మతాళము.

రామజగదభిరామ - రఘుకులాంబుధిసోమ - రాక్ష సాంతక సీతారామ - కామజనక నీదు - కరుణ జూపవదేమి- యేమనందును సీతరామ॥ రామజగ॥ అందమైనటువంటి - సుందరాంగుల జూచి - పొందుగోరితి - సీతరామ - ముందు యమభటులచే జెందరాని బాధ - నొందవలసెను - సీతా రామ॥ రామజగ॥ ఆశలోపల జిక్కి - దోసమెరుగక నేను - మోసపోతిని సీతరామదాసులకు దాసులకు దాసుడను దా

సుడనుదాసుడను- దోసమెన్న కుసీతరాము॥ రామ॥ సతతమును భక్తులకు- గతినీవెయని- వేదశ్రుతులు బల్కగవింటి రామా- అతిపాతకుడను స - న్నాదరించి [illegible] - పతితపావన సీతా రామా॥ రామ॥ యెన్నెన్ని జన్మములు యెత్తితిని - యింత కునిన్ను జూడను సీతారామా॥ పన్నుగా నీపాదపద్మముల సన్నిధి - నన్ను నిల్పుము సీతరామా॥ రామ॥ పెక్కు విధ ముల నిన్ను - నిక్కముగ వేడితిని - దిక్కునీవని సీతరాము॥ టక్కుసంసారమున - గ్రక్కునను గ్రోయుకను చిక్కు బాపు ము సీతరామా॥ రామ॥ ధరను లింగమగుంట పురమందు నెలకొన్న దశరథతనయ శ్రీరామా - అరలేక మెలనుం చి ఆదెయాఖ్యుని బ్రోచి - బిరుదు నిల్పుము సీతరామ॥ రామ జగదభిరామ - రఘుకులాంబుధి సోమ - రాక్షసాంతక సీతా రామా॥ 7

ముఖారి రాగం——ఆటతాళము.

ఏంత వేడిన రామ నాను - చింత బాపవు పరంధామ - ఎంత వేడినగాని పంత మేటికి నాపై - యింతకఠినుడవనుచు - అంతు తెలియక పోయె ఎంత॥ ముజ్జగంబులు గర్భమునను - నిలిపిన మూర్తి వంచనినన్ని నాదు - పజ్జనావన నిన్ను - సం స్మరించినవారి పజ్జజేరిన చాలు పావనచారిత్ర॥ ఎంత॥ నీవెది క్కని నమ్మినార నేసితర దైవముల మదివలచ నేర రావణుని తమ్ముండు బ్రోవుమని వేడగను - కావవే సత్కగుణ కౌసల్యా సుకుమార॥ ఎంత॥ రాక్షసాంతకభౌమ - రమణ - నాపైన కక్షయేలను త్రిశిరహరణ - పక్షివాహన నన్ను దీక్షబూని

యువేగ - రక్షించకున్న నీ దక్షత్వమిక నేల॥ ఎంత॥ యిలను
లింగముగుంట పురము - నంకు వెలసిన - హరి నీదు నామము
యెలమంచి ఆదెయ్య సలలితంబుగ గొల్వ దల - పులేదా -
బ్రోవచల మేమి ఫలమేమి॥ ఎంత వేసినగాని రామ॥ 7

జంఝూటిరాగం—ఆదితాళము.

దండమయా - వేదండవరద నీ - అండ జేరితిని బ్రోవ
ర - కుండలీంద్రశయనా నృదుభాషణ - అండజరాట్కంఖా
ణ॥ దండమయా॥ పాపపుణ్యములు పాలన జేసెటి - ప్రభువని
నిను నే వేడితి - రేపుమాపు నీదాపు జేరినీ - రూపు జూపమ
ని కోరితి॥ దండమయా॥ దోసిలొగ్గినటువంటి భక్తులకు - గా
సిదీర్తువని వింటిని - వ్యాసవరద - సుజనావన దురిత ని - రా
స - బ్రోవరమ్మంటిని॥ దండమయా॥ హరి హరి యనుచును
పరిపరి విధముల - మొరలిడినను దయలేదా - కరికి గాచిన
టువంటి బిరుదు నెక్కడి కేగెనో భువిమీద ॥ దండమయా॥
యిల లింగముగుంట పురీశుని నిను - కలనైనను నే మరువ -
చలమేలను యెలమంచి ఆదెయ్యను - సరగున బ్రోవగ రా
వ॥ దండమయా వేదండవరద నీఅండ జేరితిని బ్రోవర॥ 8

ముఖారిరాగం—అటతాళము.

పతితపావన నామ - పాహి శ్రీరఘురామ - గతిజూ
పవది యేమిర - అతులితంబుగ నీదయారస మధికముగ నా
కొసగకున్నను॥ హితవుడిగి నీ బిరుదు వీధిగో - యేమిటికి
గాకుండ జేసెద॥ పతిత॥ దాసులపోషించె దైవశిఖామణివి -
దయలేదా నామీద - వాసవార్చిత పాదయుగళ మహి - సు

తాధిప బ్రోతువని మది - నాసజెందితినయ్య - భక్తుల గాసి దీర్చిన ఘనతగల్గునను॥ పతిత॥ కరి ప్రహ్లాదుల మున్ను - కాచి నావని విన్న - కరుణ నాయెడ లేదుగ - అరమరేటికి బిర బిరను నే - మొరలిడిన వినవేమిసేతును - పరమపురుష కృపాజలధి - భవపాశఖండన - పంకితావన॥ పతిత॥ దిక్కులేని వారి - దిక్కు జూచిన ఘనత - తక్కువా నను కొంటివా - మొక్కడను గనుగొన్న నీవయి - పెక్కుమూపుల దాల్చి జగమును - అక్కజంబుగ బ్రోచు చుండెడి - చక్కని దొరవనుచు నమ్మితి॥ పతిత॥ యిలను లింగముగుంట - నిలయసజ్జనగేయ - విలసిత మృదుకాయ - లలితముగ యెలసుంచి ఆదెయ పలుగతుల నిను వేడెగాపున - చెలువుగను మీదయకు పాత్రుని - జేయుమా లేకున్న భయమా॥ పతిత॥ 9

శంకరాభరణరాగం—ఆదితాళము.

మురళీధరా నా - మొరవిని బ్రోచేటి - దొరవని నెరనమ్మితిర - కరిమొరవిని రక్షించిన మాడ్కిని - గావరాదనాద - దేవ॥ మురళి॥ పాపహారణ నాపాపములెల్లను - పారదోలవేర - రేపుమాపు నీవని జేరితి నీ - రూపు జూపవేర - మురహార॥ మురళి॥ పరమపురుషభవ - పాశవిఖండన - గరుడగమనగిరి ధీర - చిరతర సౌఖ్యమొసంగుము నమ్మిన - చెరచేవారలు గలరా॥ మురళి॥ యెల్లదేవతల కన్న మిన్నవని - యుల్లమలర వేడితిని - కల్లలేక - నాపాలనుండుమీ - కంసహారణ దయబూని॥ మురళి॥ నూర్మిమీర లింగముగుంటను - నెలకొన్న దేవకీతనయా - భర్మవసన ఆదెయదాసుని దు -

ష్కర్మంబులు కడజిమ్మ వేయుమా॥ మురళీధరా నా మొరవిని
బ్రోచేటి॥ 10

ముఖారిరాగం—ఆటతాళము.

శ్రీరామనినునమ్మియుంటి - నాదుచింత బాపుము రామ
యుంటి॥ శ్రీరామనినుజేరి - సేవ జేసినవారి - కారోగ్యభోగ
ములబ్బునంచనివింటి - మేరుధీరసుధీజనావన - సారసాయత
నేత్రననుసం - సారదుఃఖమునందగుల్పక - పారమార్థికదయ
నుజూడుము॥ శ్రీరా॥ ఎంత వేడిన సీతరామ - మదిరవ్వంతయున
కరుగదుచలమా - పంతమేటికినాతో - ఫణిరాజశయననీ -
చెంత జేరితినాదు - చింత లెల్లను బాపు - యింతకఠినుడవనుచు
నెరుగక - శాంతకానటులయుననునీ - చెంత జేర్చి సుఖంబొసగ
గిరి - క్షేమముమాసుగుణాభిరామా॥ శ్రీరా॥ సారసాక్షమృదుచ
రణ - యిదిమేరగాగానుతద్రుహిణ - కోరినవారల - కోర్కె
దీర్చెదవని - జేరిపెద్దలవలన - సారెకువినినేను - జేరితినిమీ
పాదసన్నిధి - నేరములనుదినుంచకనుదయ - మీరజూడు
మునీరదాభశ - రీరదురితనివార - శుభకర॥ శ్రీరా॥ యిలను
లింగముగుంటపురమునందు - వెలసినహరిసీదుచరితము - యెల
మంచిఆదెయ్య - పలుగతి వేడెను - కలకాలమొకరీతి - గను
పాలనము జేయు - యిలసుతాధిపజననమరణం - బులనుబడితపి
యింపజాలను - వలనుగాకైవల్యమొసగియు - సలలితానం
దునిగ జేయుము॥ శ్రీరా॥ 11

కృష్ణా వాసుదేవా । హృషికేశాయన వేమనసా॥ కష్ట
ములబారదోలి - యిష్టాపదవులిచ్చావే ॥కృష్ణా వాసుదేవా॥

తల్లిదండ్రులెవరేనీకు - తరచిచూడగా - తల్లియే - శ్రీసీతా దేవి - దండ్రియే శ్రీరాములుగా॥ కృ॥ బంధులా ప్తులెవరెకడు॥ ర్వాంధంబునబడిగూలకే యిందీరరమణునిదాస - బృందము లేనీబంధువులు॥ కృ॥ కోటివిద్యలునేర్చినను - యీ। కూటికే గద - చూడగా - కాటికివేంచేసెవేళ। నోటిమాటలేదుగా॥కృ॥ ధారుణీలింగముగుంట - ధామునీగ ఉదలచవే - కూరిమీరాయె లమంచి ఆదెయ। నేరములు క్షమియించెనే ॥కృష్ణవాసు దేవాయని॥ 12

ముఖారిరాగం — అటతాళము.

శ్రీరామచంద్ర। కరుణాసాంద్రా సేవితమునీంద్ర- సూరాన్వయతిలక సూరిజనావన - సారసాయతనేత్ర - సన్నుతచారిత్ర॥ శ్రీరా॥ యెంతోవేడుదుర - యింతటనైనచింత దీర్చవేమిర - పంతమునీకు హనుమంతాదివానరుల - నెంతో మోదంబున నేలీతివటు నేలు॥ శ్రీరా॥ గయరాదెందుకురా- దాసులనేల దలచవదిమేర - భయరహితమైన సత్పథమొసగి- పాపనీ। చయములుబోగొట్టి। సంతరించుము - సామి॥ శ్రీరా॥ కరుణాలవాల సద్గుణశీల - కాంచనచేల - పరమపురుషమురభంజన - చంద్రశేఖర చాపఖండన - సరిపాలమండన॥ శ్రీరా॥ లింగముగుంట - పురిపాల - లలితగుణజాల - మంగళమిల- యెలమంచి ఆదెయ్యకో - సంగుమయ్యాభాసు - రాంగదుర్జనభంగ ॥ శ్రీరామచంద్ర॥ 13

కమాంచిరాగం — అటతాళము.

రారశ్రీహరి జానకీపతి - నేరమేమియులేదురా - ఘో

రమైన పాపములకొన - గోటజిమ్మివేయిరా॥ పాపహరణనీదు
రూపము - జూపిముదమునొసంగరా - పన్న బాపరానటువం
టి చింతను - బాపిముక్తినొసంగరా॥ రారా॥ పిలచితే పల్క
వదియేమది - భీతిజెందితివేమిర। పలికితేనోటి ముత్య। లొలుకు
నేమో జెప్పరా॥ రారా॥ దాసవరద నిరంతరముబహు। జేసి
తినినీసేవరా - వాసిమీరగ బిరుదుచెల్లిం। పగసమర్థతబూ
నరా॥ రారా॥ ధరనులింగముగుంట - పట్టణ ధామ - పరమ
దయాకరా - సరసముగ మెలమంచిఆదెయ - సన్నుతించెను
బ్రోవరా॥ రార శ్రీహరిజానకీపతి నేరమేమియు లేదురా॥ (14)

కమాచిరాగం—అటతాళము.

ఏదిరానిదయను జూపవు - యేమినేరము రాఘవ-
సాదరంబున నిప్రసాదము - మోదముతో నాకొసగవా ॥ఏది॥
ఏమియెరుగని బాలుడను యేలాగు బ్రోచెద ఓహరి - కామితా
ర్థములొసగి బ్రోవుము - కరిని నేలిన శ్రీహరి॥ ఏది॥ ఎన్ని నేర
ములున్నగాని - కన్నసుతుని మాతిలో - పన్నగా పడద్రో
యుతం ద్రులు - నున్న నాగేభూమిలో॥ ఏది॥ కాయమే స్థిరమ
నుచునమ్మి - ప్రాయమును బోగొట్టితి - రోయకను యమ
లోకమునకు - ద్రోయకుము సీతాపతి॥ ఏది॥ పాతకులకెల్లను
నేబహు - పాతకుడనై యుంటిరా - ఖ్యాతిగను ప్రహ్లాదునేలిన-
రీతినన్నిక నేలరా॥ ఏది॥ దిక్కు లేనివారికెల్లను - దిక్కునీవేయ
నుచును - నిక్కముగ బుధులన్నమాటలు - టక్కులుగ మది
దోచెను॥ ఏది॥ ధరణిలో మెలమంచి ఆదెయ - దాసవర్యుని
బ్రోవుమీ - పరమపురుష రమామనోహర - పాహిమాం-

మురసంహార॥ ఏదిరా॥ (15)

కళ్యాణిరాగం—అటతాళము.

దండమొనర్తునయ్యా శ్రీరామయ్యా॥ దండ॥ దండమొనర్తు నియండజేరిపాద - పుండరీకములకు - నిండువేడుకతోడ॥ దండ॥ చండదానవశిక్షణ - నుతముసిగిణ - పండిత సంగక్షణ - కుండలిశయన బ్రహ్మాండాదినాయక - చండాంశుకుల భూష - సరిదీశమదశోష॥ దండమొ॥ కౌసల్యా వరతనయ - నిరతమునాకు కాంక్షలుదీర్చుమయ్యా - వాసవాదిసుర వందిత పాదానాగాసిదీర్చి బ్రోవు కమనీయవిగ్రహా॥ దండ॥ యెలనులింగముగుంటను - వెలసినహరి - యెలమంచి ఆదెయను - కలకాలమొకరీతిగను పాలనముజేయు - కలుములొసగి నిత్యకల్యాణదాయకా॥ దండ॥ (16)

జంఝూటిరాగం—ఏకతాళము.

నల్లనయ్యా నావల్లనేరమేమి - అల్లగొల్లదాసియిల్లుజేరుటేమి॥ నల్లనయ్యా॥ సుదనాంగుడనీపొందుగోరి - డెందమందు నమ్మితిమిమీరి॥ నల్లనయ్యా॥ నిన్నుబాసి- నిమిషముండజాల - కన్నియలలో చుల్కనై తిచాల॥ నల్లనయ్యా॥ అంగజునిబారి కోర్వజాల - ఖగతురంగ నన్నిటు జేయమేల॥ నల్లనయ్యా॥ లింగముగుంట పురిపాల - మోహనాంగ కరుణించుమీవేళ॥ నల్లనయ్యా॥ (17)

అసావేరిరాగం—ఆదితాళము.

ఇందిరరమణుని - పొందుగోరినదాన - యిందువేగమెతేగదే॥ సుందరాంగి వాని యిందుదెచ్చిన పది - మందిజూడగ

మది - సందేహమును లేక - అందమగు పదియారువన్నెల - కుంది
టంబగు పసిడిపతకము - నందెలును కంకణంబులుమణి - హార
ములునీకిత్తుముదమున॥ యిందిర॥ నల్లనయ్యతోఁబొందే - వల్ల
నైననాకు - మెల్లగ నొసగూర్చవె - కల్లమాటలుగావు - గొల్ల
భామలపొందు - చెల్లుననుచునాడు - యిల్లుజేర్చిన నిన్ను తల్లివని
నీమేలుమరవక - యుల్లమున నుతియించుచుండెద - పల్లవా
స్త్రుని ఘోరశరముల - పాలుజేయకుమమ్మ తాళను॥ యిందిర॥
పండువెన్నెలబయట - నుండుమనిపోయినా - యుండకురాకుం
డెనె - అండయెవ్వరులేరు - దండమొనర్చెద - నిండుసరావనమున
నుండితిగదవెనా - గుండియలు జలజలమనియె బహు - గండు
తుమ్మెదరొదలకును నే - నుండజాలను భామిపైవే - దండ
మానరో దయనుజూడవె॥ యిందిర॥ మక్కువదీరనా - చక్క
నిసామికి - మ్రొక్కితినని దెల్పవె - పక్కజేరియు నాదు చెక్కిలి
నొక్కుచు - పెక్కుబాసలుచేసి - చిక్కకయేటుజనెను - నిక్క
ముగ మన్మథునన్నిక - పెక్కుబాధలుబెట్టుచుండెను - అక్క
టా యికసైపజాలను - అగ్నిలోఁ పడియైనచచ్చెద॥ యిందిర॥
ధరనులింగముగుంట - పురిపరిపాలుఁడౌ - సరసిజాయతనేత్రుని -
పరిపరివిధముల ప్రార్థించిదెమ్మయే - వెరపునైననా - కర
వుదీరునట్లు దరిశనమునొసగియును ఆదెయదాసవర్యుని ప్రోవ
నునుమోతరుణి యిక నాలస్యమైనను పరువునంతయు భంగ
పరచెద॥ యిందిర॥ 18

ముఖారిరాగం—ఆదితాళము.

సరోజాక్ష యిటురార - నామొరాలకింపనదేరాధీర -

బిరానవాకును - వరాలొసగినీ - పరామరికయుంచరా పరా
త్పరా॥ సరోజా॥ వందనమిదె గోవిందా మునిబృందవినుత
యానందహృదయహరి- కందర్పకజనకా నామునగల సందియ
ములుదీర్పుమా శ్రీరమణా॥ సరోజ॥ కరికిబట్టు మకరంబు-
దానిమొరకు వినియు శీఘ్రంబున నరిగియు- ఘురీయనుచు మక
రితల ద్రుంచితివి_ పురందరాదిక సురావళిబాగడ॥ సరోజ॥ కుం
తిపుత్రులనుగాంచి_ వారిచింతదూన్పి రక్షించిమించి_ అంతరం
గపతివై వెలసిన ని- న్నెంతనిబొగడగ _ నే నెరమౌ మురహార॥
సరోజా॥ పూర్వంబున కనకాక్షుబల - గర్వమడచి భూకాంత
కుముదమును - పర్వతధర మొసగినవాడవుగద - సర్వరక్షకా
సదమలచరితా॥ సరో॥ ధారు శిలింగముగుంట_ పురీధాము-మా
వినుతపరాత్పర - నారివనమున ఆదెయదాసుని దయమీర బ్రో
వరా సాధుజనావన॥ సరోజా॥ 19

జంఝూటిరాగం—ఝంప్తాళము.

శ్రీరమాపతి - నీపాదమేగతి॥ శ్రీరమా॥ శరణంటిని
పావనమతి - సకల సురనుతి॥ శ్రీ॥ పాపభంజనా - నీ ప్రాపు
గోరితి - పాపము నీదయ నాయెడ - సాపరాధుడను॥ శ్రీర॥
నమ్మియుంటిరా - యభయమొసంగరా - సమ్మతిగలదా స
జనుల సొమ్ము నీవేరా॥ శ్రీర॥ సారసనయనా - గిరిధీరసద్గుణ
మారజనక భుజగశయన - మంజులవచనా॥ శ్రీరమా॥ కోరి
కదిర - లింగముగుకిట లోపల - భూరివైభవమున వెలయు
పూజితామర॥ శ్రీరమా॥ 20

కన్నడరాగం—ఆటతాళము.

౧ శ్రీపతి మొరవినుఁ - శీఘ్రమె బ్రోవ్రనను॥ శ్రీ॥ తా
పసజనహృదయ - తామరసభాస్కరా॥ శ్రీప॥ ౨ సాధుజ
నావన - వేదాంత వేద్యనా - భాధలు మాన్పుము - పన్నగ
శయనా॥ శ్రీపతి॥ 3 పాపవిమోచన - పాలితసురగణ - సా
పరాధుడనను - చక్కగ జూడుము॥ శ్రీపతి॥ ౪ పారావార
గభీరా - గిరిధర - నారాయణ నీ - నామమె నమ్మితిరా॥ శ్రీ
పతి॥ ౫ ధరనులింగముగుంట - ధామగోపాలకా - మరువక
ఆదెయ్యను - మన్నించిన ఘనమిక॥ శ్రీపతి॥ (21)

జంఝూటిరాగం — జంపెతాళము

వందనాము జేతునీకు - నందనందనా పరాకు॥ వంద॥
సందియంబు దీర్చునాకు - బంధంబుల రూపు మాపు॥ వంద॥
నమ్మియుంటినిన్ను గొలిచి - యిమ్మమాకుశిరుల్ బిలిచి॥ వంద॥
ధర లింగముగుంట పురా - ధామనన్ను యికచేకోరా॥ వంద॥

ముఖారిరాగం — ఏకతాళము.

మారజనక రారా - నవనీతచోరా॥ మార॥ కోరినిన్నె వే
డితిర భారమును దీర్చుటకు॥ మార॥ ఘోరమైన సంసారాంధ
కారమును బారదోలి - కోరితినీ సన్నిధినను - చేరదీసికోరా శౌరి
మార॥ ఆరుచక్రమూలపైని - మేరుశిఖర ముందుచూడ - ధీరు
డవై వెలసినసశృం - గారవిగ్రహా మొరవిని॥ మార॥ సచ్చిదా
నంద స్వరూప - మెచ్చుటనై ననునీవై - ముచ్చటగ పదునా
ల్గులోక - ములకు నాథుడవైతివి॥ మార॥ ధరనులింగముగుం
టపురి - ధామ ఆదెయదాసవర్యుని - మరువక బ్రోవుము క
రుణ - మెరయపరమపురుషహరి॥ మారజనక రారా॥ (23)

ఫీలురాగం—అటతాళము.

మనస శ్రీగురుమూర్తిని - మానకదలచవె॥ మన॥ ఘన
తరబాధలను - కడు జిమ్మివైచును॥ మన॥ గర్వముమానవె-
సర్వముతానవె- నిర్వాణపదమబ్బునని - నెరనమ్ముము నిర
తమును॥ మన॥ సారములేని సం - సారమె నిజమంచును-
ఊరక చెడిపోకుము - గారడియని యెంచుము ॥మన॥ పన్నా
గ్గులోకములు - చెదరక యుదరమున - కునుకుగనిల్పిన -
బుధజనమాన్యుడు॥ మన॥ ఆదెయదాసుని - భేదములేకను -
మోదమునబ్రోచెను మేదినిలోపల ॥ మనసా॥ (24)

అసావేరి రాగం—అటతాళము.

వందనములుచేతు - వచ్చిపోయొకసారి - యిందువేగ
మెసామిగ - సుందరాంగుడవని - చూచిభ్రమించితి - డెందా
మునందు యానందమాయెనుసామి॥ వంద॥ చుక్కలరాయుని-
ధిక్కరించగజాలు - చక్కదనమునెన్నగా - యొక్కనిమిష
మైన పక్కజేరియునాడు - మక్కువదీరనా చెక్కిలినొక్కర॥
వంద॥ అల్లదానిల్లు నీకిల్లునాయెర యే - వల్లతాళుదుసామిగ-
యెల్లసౌఖ్యములు నీవల్లబొందెదనని యుల్లమునను యెంతో -
యుల్లాసపడుచుంటి॥ వంద॥ మారునిశరముల - పోరుబడజా
లాను - దారిజూపవెసామిగ - కోరితి రాసామి - వేరుసేయ
కనన్ను యేలరాయీవేళ॥వంద॥వక్కలాకులుయివను- మక్కు
వగలదు - నాదిక్కు జూడవెసామిగ - పెక్కుబాసలుచేసి -
నిక్కచూడవదేమి - టక్కరిజేసేవు - తాళగజాలను॥ వంద॥
యిలను లింగముగుంట - నిలయు శ్రీగోపాల - చలముసేయగ

మేల - యెలమంచి ఆదెయాఖ్యుని బ్రోచుదొరవని - సలలి
తముగనమ్మి - చాలయాశించితి॥ వందన॥ (25)

నిన్ను బాసినిమిషమైన - నిల్వజాలసామిగ॥ నిన్ను॥ పన్ను
గనీపైసంభ్రమ - మెన్నతరముగాదురా॥ నిన్ను॥ చుక్కలరా
యునికన్న - చక్కనివాడవని - మక్కువగలదురనీపై - పక్క
బాయకు మ్రొక్కెద॥ కోటిసూర్యులైననీసరి - దీటురారని
తోచెరా - మాటిమాటికి కిటురమ్మని - నోటితోబల్కవేర॥
నిన్ను॥ కాలహరణమేలరార - జాలవయసు దానరా - జాలి
లేదస్త్రీలమీద - బాలకృష్ణదెల్పరా॥ నిను॥ చిన్ననాటి బాస
లన్ని - సున్న జేయన్యాయమా - కన్నులనాకరువుదీర - వన్నె
లన్నిజూపరా॥ నిన్ను॥ యిలనులింగము గుంటపురి - నిలయ
శ్రీగోపాలకా యెలమంచి - ఆదెయాఖ్యుని - కలుషాళిబోజి
మ్మరా॥ నిను॥ (26)

ఫీలురాగం—ఆటతాళము.

మరచిన మరుపురాదె - మాసిని నీపై భ్రమ॥ మర॥
మదుని విరిశరములకు - తరుణిరో తాళను తాళను తాళను॥
మర॥ చేసిన స్నేహము బాసుట నీమది - వాసిగ రాయియని
వర్ణన జేయవలె జేయవలె జేయవలె॥ మర॥ నవ్వినరత్నము
లు చయ్యనరాలును - వేయ్యేల నీతో సరి తొయ్యలి లేదిల
లేదిల లేదిల॥ మర॥ అందమా పూలచెండ్లు చందముపాలిండ్లు
సుందరివేగనను పొందవె పొందవె పొందవె॥ మర॥ బాసలు
జేసియు మోసముజేసితివి - దోసముగాదె నీకుభాసురాంగితా
ళను తాళను తాళను॥ మర॥ యిలను లింగముగుంట నిలయు

నిసాక్షిగా - చెలియరో నన్నేలుము పలుమాటలు వలదికను వలదికను వలదికను॥ మర॥ (27)

### ముఖారిరాగం—ఆదితాళము.

వరాలయ్యానా మొరాలకించర - బిరాన వేడితిరా పరాత్పర॥ మురాసురాంతక ధరాధినాయక - సురామరిక యుంచరా- పరాత్పరా॥ వరాల॥ ఖరాదిదైత్యుల గురంబునను ఘన - శరావళిని ద్రుంచినా పరాత్పరా॥ వరాల॥ దండిరావణుని మొండు తలలు యిల - ఖండించిన కోదండధారి హరి॥ వరాల॥ మించి వాలినటుపొంచి మృగముగల - నెంచి ద్రుంచిన విరించి వినుతహరి॥ వరాల॥ అంచితముగ యెలమంచి ఆదెయను గాంచి బ్రోవరా - కాంచనాంబరా॥ వరాల॥ (28)

### నాదనామక్రియరాగం—ఏకతాళము.

కావవేరామ కైవల్యధామ - భావజారి బాణాసనఖండన - దేవేశ్వరనుత దీనజనావన॥ కావవే॥ ౧ సారహీనసంసారములో బడి - దారిగాన దరిజేర్చుబిరాన॥ కావవే॥ ౨ దండధరుని బాధలు బడజాలను - కుండలిశయనా- చండపరాక్రమ॥ కావవే॥ 3 దండమిదిగో కోదండపాణి యఖి - లాండకోటి బ్రహ్మాండనాయకా॥ కావవే॥ ౪ పరమభక్తులను పాలించెడి నీ - బిరుదుమరచితివె - సరసిజనయనా॥ కావవే॥ ౫ ధారుణిలింగముగుంట పురీశ్వర - ఘోరదనుజసంహార పరాత్పర॥ కావవే॥ ౬ (29)

### ముఖారిరాగం—అటతాళము.

భళిభళి గోపిదేవమ్మా - సుతుని - బంటుతనములు -

వినవేకొమ్మ॥ భళి॥ కొడుకుమందకుబోవ - కోడలిచెయిబట్టి దుడుకుపనులుజేసె - జడుపింతయున్నులేక ॥ ఉడుగుమనుమిక చెడుగుణంబులు - కడునిజంబుగ ఘనతదక్కదు - పుడమిలో యీలాటిపనులకు - చెడును సంసారంబు సిద్ధము॥ భళి॥

* * * * *

భళి॥ ౨ యిల్లాండ్రిము గామటమ్మ-మమ్మల్లాడిజేయ తగునమ్మ - చల్లనమ్ముచును మా పిల్లవీధికి బోవ - బిల్లకరములుబట్టి - చెల్లునాయో తల్లి - పల్లవాధరి యిల్లుజేరియు - తెల్లవారును కొల్లలాడిన - మల్లెమొగ్గలర వికెలును శోభిల్లు కోకలు నిత్తునననట॥ భళిభళి॥ 3 బాలకృష్ణుని సేతలన్ని - చూడ - చాలవేడుకయరా నింకెన్ని - తాలిమిగల్గిపింతజెప్పనేర్తుము-చాలు చాలికనుండ - జాలమీవూరయే - లీలనైనను పరమకృపతో మేలుగా మెలమంచి ఆదెయ నేలుదొరతో చెప్పజెప్పిన - బాళిమీరగబ్రోచు మమ్ముల॥ భళి॥ ర (30)

జంఝూటిరాగం—ఏకతాళము.

ఏమిర బాలగోపాలకృష్ణా హరి - నీమము చెడి దుర్నీతి జరించెద॥ వేమిర॥ కామముచే పర - కాంతల గోరుట - నీమముగాదను నీతులు వినరా॥ ఏమిర। ౨॥ బాలుడవై యీ లీల జరించిన - చాలనవ్వుదురు సరసిజలోచన॥ ఏమిర। 3॥ ప

రులయింఁడ్లకును పలుమారునుజన - సరసముగాదురా సురుచి రాకార॥ ఏమిర। ౪॥ వాసిగఆదెయ దాసుని బ్రోచిన - భాసురాంగ సె - బాసుగాదిర యిది॥ ఏమిర। ౫॥ (31)

అసావేరిరాగం——ఆటతాళము.

మట్టమ్మయికజన్మము- బుట్టకుండగనాకు - గుట్టుగుర్తులుదెల్పవె- చట్టలోపలనున్నదీని- గుట్టుదెలియక - రట్టుజెందితిగట్టిగా నీపాదములునే - పట్టిగొలిచెద పరమభక్తితో॥ మట్ట॥ తల్లిదండ్రిగురువు - దైవమునీవని- యుల్లమందుననమ్మితి- కల్ల సంసారంబులోబడి- తల్లడించుచున్నవాడను- తల్లివై రక్షించుకల్పక - వల్లిజన్మము మారలలేకను॥ మట్టమ్మ॥ ౨ ఒంటిస్తంభముమేడ - మింటిశిఖరములోగను - గొంటికంటిలా విరాటుని- తుంటవిల్కొండింటనార్గురు- వెంటబడి బాధింపుచుండిరి- తంటలును వదలించి నన్నీవంటివానిని జేయుజననీ॥ మట్టమ్మ॥ ౩ యిప్పుడో యెప్పుడో వొప్పగ యీతనువు - నిప్పులపాలగదా- అప్పునె తప్పునె పరహాల - కుప్పును నీవున్నానును - ముప్పువచ్చునె యెన్నటికి నీగొప్పవాడననంగ జెల్లును॥ మట్టమ్మ॥ ౪ ఆరుమూడువాకిండ్లు - అందమైనగృహము - నందువింతలుదెల్పవే - పరినీసరికొండ మట్టమ - లేరునాసరిదుష్టులందు- జేరియిరువైఅయిదు తత్వము- మీరియున్న పరాత్పరుండవు॥ మట్టమ్మ॥ యిలనులింగంగుంట - మెలమంచి ఆదెయను- మేలీలకడతేర్తువె - చాలువేయి స్తంభాలమేడలో - ఫాలభాగమునందులోపల- లీలజ్యోతులసందువెల్గే- నిరామయంబై నిలిచియున్న॥ మట్టమ్మ॥ ౬. (32

బ్యాంమస్వరము — జుల్మతాళము.

కుందరదన నీమోము _ యిందుజూపవదేమె ఓ చెలి॥
కుంద॥ అందగాడనుగాన _ సందేహింపగనేల॥ కుందర॥ ౧.
యింతిరో నీచనులుపూఁల - బంతులనగనలెనె ఓ చెలి - దంతిగ
మనరో యింత - పంతమేలనె నాపై ॥ కుంద ॥ ౨. నవక
నెన్నుటకునుభుజగ - నాయకునకు వశముఓ చెలి _ పుడమిలో
నీవంటి కముజాణ లేదంటి॥ కుంద॥ ౩. నోటవచ్చుమాటరత్నా
ల_ మూటలనవచ్చు ఓ చెలి_ పాటలాధరిరతి - కూటమొసగవె
భళి॥ కుందర॥ ౪. పిలిచినపలుకవదేల _ నిలిచిమాటలాడవె
చెలి- కలికిమూరునిపూవు_ ములికిముత్యాలకొలికి॥ కుందర॥౫.
యిలను లింగముగుంటపట్టణ - నిలయగోపాలుడనె ఓ చెలి।
అలుకులేకఆదెయూఖ్యాని। కలుషావళి ద్రుంచివై_ చెద॥కు॥౬. 33.

శ్రీరాగం — ఆదితాళము.

ఎంత వేడిన దయరాదేమినీకు । పంత మేలర నాతో॥ఎం॥
కంతుజనక ప్రార్థింతును నేనిపు । డంతరాత్మనీచెంత చేర్చి నా ।
చింతదీర్చి శిగులిచ్చిబ్రోవుహరి॥ ఎం॥ కాయముస్థిర మేమియును
లేదు । జేయుమమాకుశ్రీను। శ్రీయుతమగు మీచరణంబు
లకును । వేయువిధంబుల వేమరు మొక్కితి । గాయకున్న వే
కరుణాకరహరి॥ వాసవాదిసురవినుత । భాషాపతినిగన్న అసిం
చిన విభీషణాసులను । గాసిదీర్చినట్టి ధరణిదెయ । దాసునే
లుమీా । శేషశయనహరి॥ ౩. (34)

శంకరాభరణరాగం — ఆదితాళము.

చలమేలరా। వేలా। తాళజాల॥ చల॥ చాలనిన్నువల

చినేను- పాలబడితిగోపపాల॥ చలమేలరా॥౧. రద్దీకను । వద్దు ముద్దురయ్య । ప్రొద్దుబోయెరారసామి । సుద్దులేలనిద్దురాకు॥ చలమేలరా॥ ౨ పూలపాన్పున । జాణపవ్వళించు । నవ్వుగేరు మోవిపానక మివ్వనాకు రవ్వలేల॥ చలమేలరా॥ 3. ధరలిం గము । గుంటపురిసివెలయు । దొరవునీవె ఆదెయాఖ్య । మొర ను వినియు బ్రోచువాడ॥ చలమే॥ ర. (35)

ఫీలురాగం—ఆటతాళము.

సీతామనోహర । సేవితామరనికర । చేతోభవాకార । పాతకదూరా॥ సీతా॥ తరణికులేశ్వర । తాటకసంహార । ఖర దూషణాది రాక్షసవిజితశూర ॥సీ॥ వాసవాత్మజహరణ। వర మృదుభాషణ । దాసజనావన । తామరసనయన॥ సీతా॥ 3. మారుతివరద సన్మహితదయాస్పద । వారిధిగర్వాంధ । కార మార్తాండ॥ సీతా॥ ధరను లింగముగుంట । పురియందు నెల కొన్న । సరసిజనాభ - దశరథవరతనయా॥ సీతా॥ (36)

కల్యాణిరాగం—అటతాళము.

రామచంద్రహరి - ఘోరాసురారి॥ (శ్రీ)రా॥ నేరా ములెంచక నీరజనాభనను - కూరిమిబ్రోవరాద - మారుతివ రద॥ శ్రీరా॥ ౧ పావనచరిత - పరమేశవినుత - రావణగర్వ జిత - రమ్యగుణసంయుత ॥శ్రీరా॥ ౨ కౌసల్యపుత్ర - కంజా తనేత్ర - వ్యాసాదిమానసస్తోత్ర - వరమృదుగాత్ర॥ శ్రీరా॥ 3 పాపౌఘదూర - పాలితధీర - చేపట్టిరక్షించరా - సీతామనో హార॥ శ్రీరా॥ ర ఆదెయదాస - అమలహృద్వాస - మేదినీశ లలామ - మిత్రకులధామ॥ శ్రీరా॥ (37)

### * ద్వి ప ద. *

శ్రీకరమోక్షలక్ష్మీమనోవిభుడు । లోకపావనుడు సుశ్లోకమానసుడు । దేవాదిదేవుండు దివ్యప్రభావు । డాదినారాయణుం డంతరాత్ముండు । నఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు। మఖవాదిసురలసమ్మతిబ్రోచువాడు। నాగురుండై వేడనన్నుద్ధరించె । రాగాదిద్వయదోష రహితుడై సచ్చి । దానందమూర్తియై యలరినవాని । పూనిసద్భక్తి యేప్రొద్దునుతింతు । నశ్రీగురుడు నీయవనిజన్మించె । మట్టమ్మయనమహా మహిమబెంపొంద । నామానినీమణి నరయంగ కేవ। లామోక్షలక్ష్మియటంచనవచ్చు । భక్తులచింతలు బాపగానాది । శక్తియైధరయందు జన్మించెనుంచి । నామెయందున లక్ష్యమమరంగజేచ్చి । ధీమహితుండనై దివ్యోపదేశ । మునుబొందియానందమున దేలియాడి । గనుగొనగలై నెక్కడనై ననీదు । దివ్యమాపంబని దిప్పురుచునేను। భవ్యమానసుడనై పరిపరిగతుల । గానియాడి నెలమంచి కులసింధుచంద్రు । డనునాదెయాహ్వాయుండను సాధుజనవి । ధేయుండగురుభక్తి ధీవిలసితుండ । నేయెడతప్పులు నిందున్నజూచి । సవరణజేసిన సత్కవీంద్రులను । ప్రవిమలభక్తితో ప్రార్థింతుధరను

### మ ం గ ళ హా ర తి.

#### ఆనందభైరవి—ఆదితాళము.

మంగళమిదిగో । రఘుపుంగవ జయజయ॥ మంగళ॥ మంగళవిగ్రహా । మదదైత్యనిగ్రహా । సంగరశూరశుభాంగ కృపాంతరంగ॥ మంగళ॥ తరణికులాధిప । గురుతరవిజయా

టోప । హారపురహారచాప । సరసానులాప చిరతరానంద రూప। సేవితాఖిలభూప॥ మంగళ॥ ధరను ఆదెయదాస'। వర దసుగుణవిలాస । గిరిచరపాలిత । సురమునివినుత । షరషం ధినిర్జిత । పాథోధిశోషిత ॥మంగళ॥

శ్రీగురవేనమః.

# కందార్థములు.

కం॥ గురుసేవ కోరిచేసిన । దొరకును కైవల్యపదవి దోషములణగుణ । పరిపరి విధముల దెలియక । పరుగులు బా రకను మనస ॥ పాటించి వినవే ॥ పరబ్రహ్మమును భావించి గనవే । యేటికి భ్రమ నీకింకేటికి యీతనువు । కాటికెగాని యీలాటిచేష్టలుమాని ॥ పాటించి వినవే । పరబ్రహ్మమును భావించి గనవే॥ (1)

కం॥ శ్రీగురు మహిమలు యిలలో । బాగుగ గన్నట్టి వారు పరమపవిత్రుల్ । భోగంబుల కాశించియు । రాగద్వే షమును విడక॥ రాదుగముక్తి । మనసానీకు లేదుసద్భక్తి। సా ధనసంపద బోధ తెలియకను యీ । మేదిని బుట్టుట మేలనెద వందుచే ॥ రాదుగముక్తి। మనసానీకు లేదుసద్భక్తి॥ (2)

కం॥ గురువును నరుడని మరిమరి। గురు తెరుగక గొంద రంద్రు గుణవిరహితులై । పరికింప నట్టివారల । నరపశువుల టంచు బలుక ॥ నగు ధరలోన। జన్మంబునెత్తగ మంచిదగునా అగణితానందస్వ । యం ప్రకాశుండైన భగవంతుగననియీ। పాడుదేహము గాల్ప ॥ నగు ధరలోన। జన్మంబునెత్తగ । మం

చిదగునా॥ (3)

కం॥ యిలలోపల గురుమూర్తిని । తెలియక బహు మాయకలిత తిమిరములోనన్ । గళవళపడి చెడిపోకుము। ప టువిధముల గురుని జేరి ॥ పట్టుపదములను మనసా । విరుగగొ ట్టు మదములను గుట్టు తెల్పినయట్టి గురుడె సర్వంబని । పట్టువి డకు విడిన నట్టేటమునిగెదవు ॥ పట్టుపదములను మనసా । వి రుగగొట్టు మదములను॥ (4)

కం॥ పంచదశాక్షరి నెరిగిన । సంచిత కర్మములు నెల్ల స మయించుభువిన్ । ద్రుంచును యీషణత్రయముల । ద్రెంచు ను సద్గుణములను యిది॥ దెలియవె మనసా। బ్రహ్మమునీలో పలనుండు మనసా । పంచవింశతి తత్వ భావము తెలిసి । ప్రా పంచాతీతునిగన్న । బాయునీ జన్మమని॥ దెలియవె॥ (5)

కం॥ తనలో వెలిగెటి వానిని । మనమున గుర్తించలేక మానవులెల్లన్ । ఘనముగ మునివృత్తినిగొని । వనముల కేగి నను ముక్తి॥ వచ్చునాయన్న । నిజముగ మేలు దెచ్చుటసున్న। దానధర్మంబులు మానాక జేసిన పూని సద్గురువుల పూజ జేయ కముక్తి వచ్చునాయన్న॥ (6)

కం॥ వ్రతములు క్రతువులు చేసిన । సతతము గోవ స్త్రభూమి సంఘమొసగినన్ । వెతలబడియాత్రలన్నియు । క్షి తిలో దిరిగినసుము క్తి ॥ చేకూరదయ్యా అతనికి జ్ఞాన మమర దోయయ్యా। ధాత నుదుటను మూడు గీతాలు వ్రాసిన రీతి చె ల్లును వేరే రీతిచెల్లదు ముక్తి॥ చేకూరదయ్యా॥ (7)

కం॥ బంధువులు గలరు నా కని । అంధునిగతి బల్క

బోకు మతిమూర్ఖుడవై । యిందిర రమణుని కన్నను । బంధువులున్నారటంచు ॥ బల్కాకె మనసా ॥ అందులనీవు జెందెదవె హింసా మందమతివిగాక కందర్పజనకూని సుందరపాదారవిందాములను మరచి॥ బల్కాకె మనసా॥ (8)

కం॥ ఇలునిల్లాలనియును తన । తలిదండ్రియు । నాప్తమిత్ర తనయులనియునీ । యిలదుర్భ్రమ లనుజెందకు । మూలము లేనట్టి తనువు॥ మురవాకేమనసా । యెవరికివారె । యెరుగవెమనసా । కాలమంతయుదీరి । కాడుజేరేనాడు । జాలిచెనవరైన । జరిగేరనీవెంట॥ మురవాకేమనసా॥ (9)

కం॥ మానవ జన్మంబెత్తియు । జ్ఞానము లేకున్నవాని ఖరమనవలెరా । మీనము వలలోజిక్కియు । ప్రాణములను విడచునట్టి॥ భావమదేల । చానలవలలో జిక్కుటమేల । కనుగొనజ్యోతిప్రకాశుడౌ శ్రీగురుని । తనలో వెల్గుచునున్న తాగుర్తించగలేని॥ భావమదేల॥ (10)

కం॥ ఎక్కడి మనసంసారం । బెక్కడితలిదండ్రి బంధు। లెక్కడిసుతులు । ఫక్కిది సత్యమదొక్కటె । నిక్కముగురు పాదములకు॥ మ్రొక్కవేమనసా । నిక్కులుమాని । గ్రక్కునమనసా । ఠక్కవలెనునీవు । పెక్కువిధములబోక । చక్కగగురుపూజ । మక్కువతో జేసి॥ మ్రొక్కవెమనసా॥ (11)

కం॥ అజరుద్రాదుల కందక । త్రిజగంబులు నిండియుండి । దేవవిభుండై । నిజగురుని చెంత జేరియు । పూజలుతా జేయువారే॥ పుణ్యపురుషులురా । భువిలోనా రే। పూజ్యులువినరా। రాజరికులుమాని । గాజుకుప్పెలో జ్యోతి । తేజరిల్లుచునున్న ।

తీరు వెలయువారె॥ పుణ్యపురుషులు రా॥ (12)
కం॥ పట్టెడియీసంసారము । గుట్టును దెలియంగ లేక ।
కూలెదరిలపై । పుట్టలో చెదలును పుదయము । పుట్టియు । సా
యంత్రమునకు॥ గిట్టినమాడ్కి । జగములుపుట్టు । గిట్టు నెప్ప
టికి । గట్టిగ సరికొండ ముట్టమ్మ గురునిచే । గుట్టు దెలసిన వారు ।
పుట్టరు పృథివిలో॥ గిట్టినమాడ్కి॥ (13)

## ద్విపద.

తల్లిదండ్రియు గురుదైవంబు నీవె। కల్లలేకను జగత్కర్త
వునీవె। పదునాల్గుభువనముల్ బాగుగనీదు। ఉదరంబులో నిల్పి
యున్న దేవుడవు।జలబుద్బుదముల భాస్కరుడుంపినట్లు। కలసికల
మకనుంటి కల్లయుగమునను। కావున నిను నేను గనుగొన లేక।
భావమందున దలచి ప్రార్థింతునిన్ను। ఘనతరంబుగ తల్లి గర్భం
బు వెడలి। దినదినవృద్ధిచే తేజరిల్లుచును। బాల్యకౌమార యవ్వ
నప్రాయమందు। గొల్వలేకను నిన్ను కోరికమీర। భామామణు
లవలను బడి లేవలేక। కామమోహముల నేగాఢాంధకార। మున
బడిగొన్నాళ్లు మూల్గుచునుంటి। మనమున దెలియక మగ్నత జెం
ది। వాతపిత్తశ్లేష్మవ్యాధుల చేత। పాతకుడనై బహుబాధలబ
డుచు। భీతినొందితిఁగాన ప్రియముతో వినుడి। పాతకౌఘవిదూర
పాలింపు నన్ను।నీవుదప్పగ నాకు నితరులెవరిలను కావను బ్రోవ
ను కర్తవునీవు। నన్నుద్ధరించుటకు నవతరించితివి। సన్నుతచారి
త్ర సదమలహృదయ। సరికొండముట్టమ్మ జగదాంబవమ్మ। సరి
యేరవసుధ నెసరనీ వెగాక। అగణితంబైన భక్తాళిని బ్రోవ। జగ
తికిదిగిన బుధజనకల్పవల్లి। గురురూపమెత్తిన కువలయనేత్రి

కరమర్ధిమీార లింగముగుంటనున్న యెలమాంచి ఆదేయను యెడ
బాయరాని। కరుణాబ్రోవుముతల్లి కలకాలమెల్ల॥

కీర్తన.

గురినిల్పి చూడండయా- మీాలోనెమీారు॥ గురి॥ గురిని
ల్పిచూచిన మరుగింతయును లేక గురుడెగన్పడును యే। కరణి
నైనమీారు॥ గురి॥ గురువుల చేమీారు। మరుగులు దెలసిన। పర
మార్ధమునుమీాకు। కరతలామలకమా॥గురి॥ చంచలగుణము
లు। ద్రుంచివేసియును। యీా పంచదశాక్షరి పఠించిమీా
రు స॥ద్గురి॥ అర్ధముకొరకు నిరర్ధకముగమీారు। వ్యర్ధులయి
గూలుదురు। సార్ధకమేమిగలదు॥ గురి॥ వాదమువిడచి కుల।
భేదమునణచియా। నాదస్వరూపుని। పాదుదెంసిన మేలు॥గురి॥
గట్టిగసరికొండ మట్టమ్మగురునిచే। గుట్టుదెలిసినవారు। పుట్ట
రుభూమిపై॥ గురి॥ యిలనులింగముగుంట। నిలయునిమదినిల్పి।
యెలమంచిఆదెయ కలదెల్పె ఘనులార॥ గురి॥

కీర్తన.

ఆంజనేయ నన్ను బ్రోవవేగా। శత్రుకుంజరహర్యక్ష।
శౌర్యసార॥ ఆంజ॥ రాముసోదరుండు మూర్ఛ వ్రాగ॥ నీమమున
సంజీవిదెచ్చితివేగా॥ ఆంజనేయ॥ వారిధీసిదాటి లంకకుబోయి।
సీతనారీ జాడదెచ్చితివోయి॥ ఆం॥ పుట్టినపుడే భాస్కరునిబట్టి
క్షుధను। అట్టేఫలమని మ్రింగినట్టి॥ అంజనేయ॥ కపికులాబ్ధి
మృగాంకనీవింక। నన్ను కృపతో రక్షించు లేకశంక॥ అంజనే॥
యిలనులింగముగుంట। పురవిహారా। దయనుయెలమంచి ఆదె
యనుజూడుధీరా॥ ఆంజనేయ॥

## ద్విపద.

శ్రీకరంబైన యీ సృష్టిలోపలను । ప్రాకటంబుగజనుల్ పరిపరిగతుల । ఎవరని యడిగిన యేమిదెల్పుదును। వివరింతుసద్భక్తి వివరంబుగాను।ఉపదేశమనుదేశ మొప్పగాగలదు। కపటమానవులకు గానరాకుండు । కాయాపురంబు మాఘన పట్టణంబు। వేయువిధముల సరివెదకిన లేదు। అప్పురంబునయేడు అంతస్థనువులు। గొప్పమేడయుగల దుకూర్మితో వినుడి పదునాల్గులోకముల బాగుగమీరు। వెదకినను గన్పడదు వివరింతుమీద। గలగుయచ్చటను క్త కాంతమాజనని। పలువిధంబుల మనల పాలించునట్టి।ఓంకారస్వరూపు డోనరమాజనకు। డకలంకుడును సచ్చిదానందుడతడు। ప్రేమతో వారికి పెక్కుంద్రసుతులు భూమిలోనున్నారు పూజ్యులైవారు। వారిముచ్చటవైభవం బెన్నగాను। కోరినవారికి కోర్కెలిచ్చుచును। నున్నారుగాన సద్యోముక్తినొసగ। విన్నవారైమీరు విశదంబుగాను। పట్టుడు గురుపాదపద్మముల్ భక్తి। గట్టిగా మిమ్ములకడతేర్చివేగ। ఉపదేశమనుదేశమునికిగా జేసి। యపరిమితానంద మందగాజేయు। యెలమంచి ఆదెయ యిట్టిమహిమలను। సలలితంబుగదెల్పె సజ్జనులార॥

## కందార్థములు.

కం॥ చదువులు చదివినఫలమా । విదితంబుగ సత్యవాక్య వివరమెరుగకన్ । అదినాదియిదియనాదని తుదమొదలెరుగకను బ్రేలు॥ దురు భూమియందు। జనములు గూలుదురు భవములందు। యిదియేటిపరసము యిదియేటి యరుసము ము

దమొదవునట్టి యీముక్తిగానక ౹ బేలు॥ దురు భూమియందు॥ మూలములేనిశరీరము ౹ కాలంబునుదీరినపుడె కాటికి జే రుక ౹ మేలుగనాపలుకులువిను౹ ఏలను నీకింతమోహ॥ యింతే చాలునురా౹ యిహసౌఖ్యము౹ లెంతటివిగనరా ౹సంతసమునగు రుని చెంత జేరి బుధు౹ లంతమేలనగ జ్ఞానానందమయుడగుము యింతేచాలునురా॥

కీర్తన.

వట్టిది యీసంసారం దీనిగుట్టుదెలియుని స్సారం ౹ చట్ట లోపల వెల్గుచున్న వి ౹ రాట్టును గనుమిక దిట్టముగాను॥ వట్టి॥ మచ్చకంటులనుజూచి ౹ బహుమెచ్చెద వేమి ఛీఛీ౹ తుచ్ఛభోగ ములకిచ్ఛగించినను ॥ చిచ్చులోబడెదవు౹ సిద్ధముసుమ్మి॥వట్టి॥ మూడుగుణములనువిడిచి గురుమూలము గనుగొని తరచి ౹ చూడు ఆరుపై మేడలోపల ౹ మోడివేసి యీముక్తి కాం తను॥ వట్టిది॥ దారపుత్రులననేల ౹ భ్రమాదబ్బరయని కనవేల౹ సారములేనిది ౹ భారమానుగద ౹ చేరుమాసివిక ౹ (శ్రీ)గురుస న్నిధి॥వట్టిది॥ కాయము స్థిరమనినీవు ౹ యిల మాయకులో బడి నావు ౹ ప్రాయమందు గురుపంచను జేరర ౹ ధీయుతుడవునై తేజరిల్లెదవు॥ వట్టిది॥ గట్టిగాను సరికొండ ౹ గురుమట్టమ్ము చెవిని యుండ ౹ యిట్టిదనుచు యెలమించి ఆదెయ ౹ గుట్టుదెల్పెగద కుదురుగ ధరలో॥ వట్టి॥

సంతోషమాయెను సబ్ - అశిష్టాంటు యినస్పెక్టరు ధారగారు - చింతాలు దీరెను (శ్రీ)కాంతుని గన్గొనినట్లు॥ సం॥ యండవానలగాలి కేంచేయుటాయెనెట్లు - నిండు కారుణ్యరస

ముండి బాలురయుందు ॥ స॥ తల్లి దండ్రులకన్న దయను గ
లిగియు మీారు - పిల్లలఁబ్రోవుచుంతో ప్రేమమీార నరుదెంచు
ట॥ సం॥ మించి మీాకృపచే మద్భాగ్యమే టీచరుగారు - మం
చిపాటలు చదువు మించిబోధించెగాన॥ సం॥ కమలములును ర
విశౌదురుజూచిన మాట్కి - విమలమగు మీారాక కిచ్చగించి
యుంటిమి॥ సం॥ ధరను లింగముగుంటపురిని వెలసినశ్రీ - ధరు
డు బ్రోచు మిమ్ము మీాకరుణచె మమ్ము నేలు॥ సంతో॥

# 1, 2, 3, 4 తరగతులకు

## నోటిలెక్కలు, యుక్తిలెక్కలు.

# Mental Arithmetic

For

## The 1st, 2nd, 3rd & 4th STANDARDS.

గవర్నమెంటు ట్రైనింగుస్కూలు రిటైర్డు హెడ్మాష్టరు,
మహాకాళి సుబ్బారాయఁడుగారిచే
రచియింపఁబడియె.



పబ్లిషర్సు
రామా అండ్ కో
హెడ్డాఫీసు, ఏలూరు,
కృష్ణాజిల్లా.
బ్రాంచి:—తర్లపాడు, నెల్లూరుజిల్లా.

**Revised and Enlarged Edition.**

PRINTED AT THE RAMA PRESS, ELLORE.
1916

 [వెల 0-4-0.

# పీఠిక.

1. మనోగణితమునం దంతగా శ్రద్ధయుంచి యుపాధ్యాయులు బోధింపకపోవుట మిగుల శోచనీయమైన సంగతిగా నున్నది. ఇంటిలెక్కలయందు గాని బజారులో నేమైన కొనునప్పుడు గాని వాని యావశ్యకత కానుపింపక మానదు. గణితమందు త్రైరాశికము, వడ్డీలెక్కలు మొదలగు నేపద్ధతులైన నేర్పబూనునపుడు ముందుగా నాపద్ధతులమీఁది తేలిక లెక్కలను నోటిలెక్కలుగా బోధించినపిమ్మటగాని యాపద్ధతులను బాలురు సులభముగ గ్రహింపఁజాలరు. కాఁబట్టి యింత యుపయోగకారియగు నంశమును ఎంతమాత్రమును నిర్లక్ష్యము చేయఁగూడదు.

2. నేను వెనుక 1902 వ సంవత్సరములో ప్రైమరీ నోటిలెక్కలు నొకచిన్న పుస్తకమును వ్రాసి ముద్రించితిని. ఇపుడా పుస్తకములోని లెక్కలను, నవీనపద్ధతుల ననుసరించి మొదటి నాల్గుతరగతులకును ప్రయోజనకారియగునట్లు పుస్తకమును వ్రాసి ఏలూరులోని శ్రీరామా అండ్ కం వారు కోరినందున ఈపుస్తకముయొక్క కాపీరైటును వారికి అమ్మివేసి దీనియందు సుమారు 750 లెక్కలు వేయబడియున్నవి.

3. ఉపాధ్యాయులు ప్రతిదినము అరగంటకాలము తరగతివా రందఱు ఈపుస్తకములోని కొన్నిలెక్కలను సాధకము వేయునట్లు చేయుటయేగాక లెక్కలను మార్చిమార్చి అడుగుచుండవలయును.

4. పథకములను, మానములను కంఠపాఠము చేయింపవలయు నేను వేరుగా చెప్పనక్కఱలేదు.

పూళ్ల
1-12-11

ఇట్లు,
మహాకాళి సుబ్బారాయుఁడు,
రిటైర్డు హెడ్‌మాస్టర్,
గవర్నమెంటు ట్రెయినింగు స్కూలు,
గుంటూరు.

# 1, 2 తరగతులకు
# నోటిలెక్కలు.

1. అణాకు 2 పండ్లవంతున 3 అణాల కెన్నిపండ్లు ?
2. ఒక్కొక్కనికి 3 పండ్లవంతున 9 పండ్లు ఎందరికివచ్చును?
3. ఒక్కొక్క బాలునికి 2 వంతున 4 గురికి ఇచ్చుపండ్లు ఒక్కొక్కనికి 4 వంతున ఇచ్చినట్లయితే ఎందరికివచ్చును?
4. 16 పండ్లుగల గంపలోనుండి ఒక్కొక్కపిల్లవాడు 3 వంతున 4 గురు తీసికొన్నట్లయితే ఎన్ని మిగులును ?
5. నావద్ద 6 జతలచీరెలున్నవి. అనగా ఎన్నిచీరెలు ?
6. 8 కాళ్ళుగల ఎడ్లు అనగా ఎన్ని ఎడ్లు ?
7. ఎద్దుకు నాలుగు కాళ్ళవంతున 3 ఎడ్లకుగల కాళ్ళెన్ని ?
8. ఒకడు డజనుపండ్లు 6 డబ్బులకుకొనెను. ఒకడబ్బు కెన్ని ?
9. నీవద్ద 5 పండ్లును నావద్ద 7 పండ్లునుఉన్నవి. ఇద్దరివిఎన్ని?
10. నీవద్ద 4 పండ్లును, నావద్ద 7 పండ్లును ఉన్నవి. నావద్ద ఎన్ని ఎక్కువ ఉన్నవి ? [నీవద్దఎన్నితక్కువ?
11. నావద్ద 10 పండ్లును, నీవద్ద 6 పండ్లును ఉన్నవి. నాకంటె
12. నాకుడిచేతిలో 4 రూపాయలున్నా, ఎడమచేతిలో 5 రూపాయలున్నా, జేబులో ఒక్కరూపాయయుఉన్నది. అన్ని కలిసి ఎన్ని ? [వచ్చును ?
13. నావద్దనుండు 6 దమ్మిడీలను మార్చితే ఎన్నికానులు

14. ఒకచోట 15 రూపాయలున్నవి. మూడేసి రూపాయలను ఒక పోగుగా పెట్టినట్టయితే ఎన్నిపోగులగును?

15. ఒకగంపలో 16 పండ్లుగలవు. వానిలో 11 పండ్లుతింటె ఇంక ఎన్నిమిగులును?

16. ఒకనివద్ద పావులావున్నది. వాడు కానికి ఒకటివంతున ఎన్నిపండ్లు కొనవచ్చును?

17. రామునివద్ద 11 గోలీలున్నవి. రంగయ్యదగ్గర 9 ఉన్నవి. రాముడు రంగయ్యకు ఎన్నిఇచ్చితే ఇద్దరివద్ద సమానముగా నుండును?

18. 18 అనగా నెంత?

19. రూపాయకు అర్ధరూపాయలెన్ని?

20. ఎన్నిపాతికలు అయితే ఒకటి అగును?

21. 4 పండ్లను ఎన్నిపాతికలుగా చేయవచ్చును?

22. 2 దమ్మిడీలకు 3 పండ్లుకొంటే అర్ధణాకెన్ని?

23. 1, 2, 3, 4 5 వీనిని కలిపి మొత్తములోనుంచి 6 తీసివేస్తే ఎంతమిగులును?

24. 16 తో ఎంతకలిపితే 20 అగును?

25. 30 ని ఎన్ని పదులుగా నుంచవచ్చును.

26. 20 లో ఎన్ని 5 లున్నవి?

27. ఒక్కొక్కనికి 3 డేసి రూపాయలవంతున 15 రూపాయలు ఎందరికివచ్చును?

28. ఒకపుస్తకము అర్ధరూపాయవంతున డజనువెల యెంత?

29. ఒక పిల్లవాడు తనవద్దనున్న 16 పండ్లలో సగముతిని వేసెను. ఎన్ని వానివద్ద మిగిలియున్నవి?

